# సౌదామినీ కవితలు

డా॥ జె. బాపురెడ్డి

జయం పబ్లికేషన్సు
హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్

SOUDAMINI KAVITHALU (Lighteing poems)
by **Dr. J. Bapu Reddy**



*First Edition* - 1998

*Price* - **Rs. 75/-**
**US $ 10**

*Cover design :*
**SREE BALAJEE GRAPHICS**

*Published by :*
**Jayam Publications**
Plot 10, Road-5,.
Jubilee Hills, Hyderabad.
Published with the Financial Assistance of
**"Dr. J. Bapu Reddy Literary and Cultural Foundation Trust"**
Hyderabad.

*Copies available at :*
**VISALANDHRA PUBLISHING HOUSE**
Sultan Bazar, Hyderabad.
**ANDHRA SARASWATHA PARISHATH**
Boggulakunta, Hyderabad.
**NAVODAYA BOOK SELLERS**
Kothi, Hyderabad.
**JAYAM PUBLICATIONS**
Jubilee Hills, Hyderabad.

*Printed at :*
**Vipla Printers (P) Ltd.**
Nallakunta, Hyderabad - 500 044.
Ph. : 7636242

*Composed by :*
**SREE DATTASAI GRAPHICS**
1-8-702/105, Nallakunta, Hyderabad - 500 044.
Ph. : 7633275, 3020719

# అంకితం

భారతీయాత్మ చేతనతో

తెలుగు భాషా సంస్కృతులకు

అమెరికాలో వెలుగు తోరణాలు కడుతున్న

తెలుగు వారందరికీ

అమెరికన్ తెలుగు అసోషియేషన్ (ఆటా)

అయిదవ మహాసభల వేదిక నుంచి

(డెట్రాయిట్, జూలై 2-4, 1998)

ఈ "సౌదామినీ కవితల" తోట స్నేహోపాయనంగా అంకితం

**తొలి ప్రతి బహూకృతి**

మహాసభల అధ్యక్షులు డా॥ గోపాలరెడ్డి గాదె, M.D. గారికి

# ఆటా పిలుపు పాట

రండి రండి తెలుగులార!
ఆటా విరితోటకు
మన భాషా సంస్కృతులు
పరిమళించు కోటకు-

యువతీ యువకులు కలిసి
పిల్లలు పెద్దలు కలిసి
పరిచయాలు పంచుకునే
అభిమానం పెంచుకునే
వేదిక మన ఆటా
ప్రతిభా ప్రగతికి బాట- ॥ రండి ॥

తెలుగు భారతి విశిష్ట
విలువలు పోషిద్దాం
అమెరికావని నిండా
ఆత్మీయత పండిద్దాం
రసానంద కళాస్పంద
రసికాత్మలు వెలిగిద్దాం- ॥ రండి ॥

తెలుగు ఆట తెలుగు పాట
తెలుగు కట్టు తెలుగుబొట్టు
తెలుగు చరిత తెలుగు ఘనత
తెలుగుదనం శోభిల్లే
మన ఆటా మహాసభల
మహోత్సవాలకు రండి! ॥ రండి ॥

కుల మత వర్ణ వివక్షలకు
కలహం కలతలు కక్షలకు
తావులేని సహజీవనం
ఆటా పవిత్ర ఆశయం
అక్షరాల సాధిద్దాం- ॥రండి ॥

- జె. బాపురెడ్డి

## 'మాట.....

ఇవి సౌదామినీ కవితలు - మినీకవితలు కావు. 'మినీకవిత' అనే ఏ రూపానికి సంబంధించినది. "సౌదామినీ కవితల" స్వభావానికి ంబంధించినది. ఒక మెరుపువంటి భావాన్ని భావచిత్రంగానో, ంకారంగానో, వాగ్వైచిత్రిగానో, చమత్కారికగానో మెరిపించటమే కవితా స్వభావం. అందువలనే వీటిని "సౌదామినీ" కవిత లన్నాను. వీని పాఠకులు ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

ఈ గ్రంథానికి భాష్యప్రాయమైన పీఠిక వ్రాసిన మిత్రులు, ఉత్తమ మర్శకులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారికి నేను కృతజ్ఞుణ్ణి.

ఈ కవితా సంపుటిని డెట్రాయిట్‌లో జరుగుతున్న అమెరికన్ తెలుగు అసోసియేషన్ (ATA) వారి అయిదవ మహాసభలో ఆవిష్కరించడానికి, అమెరికాలోని తెలుగు వారికి అంకితం చేయడానికి అవకాశం కల్పించినందుకు ఆటా అధ్యక్షులు డా॥ గోపాలరెడ్డి గాదె గారికి, కన్వీనర్ కె. దేవేందర్ రెడ్డి గారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు. జ్ఞానపీఠ పురస్కార గ్రహీతలు, పద్మభూషణులు, రాజ్యసభ సభ్యులు ఆచార్య సి. నారాయణ రెడ్డి గారి సమక్షంలో ఈ సన్నివేశం జరగడం నాకు సంతోషం కలిగిస్తూంది. అంతర్జాతీయ వేదికల మీద నా రచనలు ఎన్నో ఆవిష్కరింపబడటం నా సుకృతమని ఈ సందర్భంలో మనవిచేస్తున్నాను.

ఈ గ్రంథ ప్రచురణకు ఆర్థిక సహాయంచేసిన "డా॥ జె. బాపురెడ్డి సాహిత్య సాంస్కృతిక ధర్మసంస్థ" వారికి మహదానందంతో కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాను. సంస్థ ధర్మకర్తలు శ్రీయుతులు ఎస్. రాధాస్వామి, ఎ.వి.యస్.రాజు, ఎస్. కొండలరావు, జె. మారుతి,

జి.ఎస్. ప్రకాశరావు, పి. మహేందర్ రెడ్డి, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారలు నా పట్ల చూపిన ఆదరాభిమానాలకు నా హృదయపూర్వక అభివందనాలు.

ఈ గ్రంథాన్ని సర్వాంగ సుందరంగా ప్రచురించిన "జయం పబ్లికేషన్స్" వారికి నా అభిమాన పూర్వక కృతజ్ఞతలు. అందంగా అక్షరాల కూర్పు చేసిన శ్రీ దత్తసాయి గ్రాఫిక్స్‌కు విశేషించి డా॥ వి. యస్. లక్ష్మికి నా అభినందనలు. ముద్రణ, ఒక కళగా ఉపాసిస్తూ రంగంలో రాణిస్తున్న విప్లా ప్రింటర్స్ ఈ గ్రంథాన్ని అందంగా ముద్రించారు. ఆ సంస్థ వారికి ముఖ్యంగా శ్రీయుతులు విజయసేనా రెడ్డి, జె. మారుతి గారలకు కృతజ్ఞతలు.

"క్షమయాధరిత్రి" గా నా సంక్లిష్ట సాహితీయాత్రలో నాకు తోడ్పడుతున్న నా జీవితేశ్వరి రాజేశ్వరికి నా ఆత్మీయాభినందనలు.

నా అంతర్జాతీయ సాహిత్య చేతనకు చేయూతనిస్తున్న రాధికా-బాలాజీ జంకె (USA) యువ దంపతులకు నా ప్రశంసాపూర్వక శుభాకాంక్షలు.

భావస్ఫోరకమైన ముఖచిత్రాన్ని రచించిన శ్రీబాలాజీ గ్రాఫిక్స్ వారికి ధన్యవాదాలు. నా రచనల పట్ల ఆదరాభిమానాలు ప్రకటిస్తూ నన్ను ప్రోత్సహిస్తున్న పాఠక కోటికి నా వినయ పూర్వక కృతజ్ఞతాంజలి.

డెట్రాయిట్
జులై 2, 1998.

**- జె. బాపురెడ్డి**

# మరుపురాని మెరుపులు

మెరుపులా ఆలోచించటం, మెరుపులా కవిత్వం చెప్పటం డా॥ జె. బాపురెడ్డి గారికి వెన్నతో వచ్చిన విద్య. అందువల్ల సౌదామినీ కవితలని ఈ సంపుటికి పేరుపెట్టటం ఎంతో సహజంగా ఉంది.

మినీకవితను సౌదామినీకవితగా చెప్పారు ఆచార్య సి. నారాయణరెడ్డిగారు. సౌదామినీకవిత అనేమాట మినీకవితకు పర్యాయపదమా అన్నంతగా సాహితీ లోకంలో ప్రచారం పొందింది. అయితే, బాపురెడ్డిగారు సౌదామినీ కవితను మినీకవిత అనే అర్థంలో వాడినట్లు లేదు. ఎందువల్లనంటే సౌదామినీ కవితలన్నీ మినీకవితలుగా కానపడటం లేదు. అయితే వాటిల్లో కొన్ని మినీకవితలు ఉండవచ్చు. మినీకవితా రూపంకంటే విలక్షణంగా ఉండే మెరుపుల్లాంటి కవితలకు ఈ మధ్య కవులు వేరే వేరే పేర్లను పెట్టి పిలవటం పరిపాటి అయిపోయింది. డా॥ బాపురెడ్డిగారు తమ మెరుపుల్లాంటి కవితలను సౌదామినీ కవితలని పిలవటం ఈ బాణీలో చక్కని ప్రయోగం.

బాపురెడ్డిగారు ఎన్నుకొనే వస్తువులలో రాజకీయ నిబద్ధత కనపడదు. అయితే, మానవతావాదాన్ని ఆయన సర్వత్రా సమర్థిస్తూ ఉండటం గోచరిస్తుంది. మెరుపులాంటి బావాన్ని సాధ్యమైనంత మెళకువగా ఆవిష్కరించటం ఈ సౌదామినీ కవితల స్వభావం. మెరుపు ఎటువంటి ప్రయోజనాలను సాధిస్తుందో, సౌదామినీ కవిత కూడా అటువంటి ప్రయోజనాలను సాహితీలోకంలో సాధిస్తుంది.

నల్లని మబ్బుల మధ్య మిరిమిట్లు కొలిపేటట్లు జిగేలుమనటం మెరుపు స్వభావం. అలాగే ఒక అపూర్వమైన అంశంమీద అపూర్వంగా వెలుగు చిమ్మటం సౌదామినీ కవితా స్వభావం : ఉదాహరణకు 'ఆత్మజ్ఞానం' :

"ఆత్మను పరమాత్మను విడదీసేది, దేహం
ఆత్మను శరీరాన్ని విడదీసేది, అహం
ద్వైతాన్ని అద్వైతం చేసేది, సోహం."

వెలుగులాంటి అలంకారాన్ని ఆమూలాగ్రం నిర్వహించి అబ్బురపాటు కలిగించే సౌదామినీ స్వభావానికి 'చితాభస్మం' చక్కని ఉదాహరణం.

"ప్రచండ సూర్యమండల కాష్ఠంలో
దహన సంస్కారం పొందిన

గత చరిత్రల చితాభస్మాలను
కాలబ్రహ్మ కలిపి వేస్తున్నాడు.
పవిత్రాకాశ పయోధిలో".

చీకట్లో నడిచేవారికి మెరుపు త్రోవ చూపిస్తుంది. అలాగే సౌదామినీ కవిత ప్రబోధాత్మకంగా ప్రకాశిస్తుంది. ఉదా : 'కోకిలత్వం'.

"కవిత్వాన్ని రాజకీయం చేసే, కాకితత్వం పోవాలి
రాజకీయాన్ని కూడా కవిత్వం చేసే, కోకిలత్వం రావాలి".

మెరుపు చమత్కారానికి ప్రతీక. చమత్కారాలను మెరిపించే కవిత లెన్నో ఉన్నాయి ఇందులో. 'మౌనభాష' ఇందుకు మనోజ్ఞమైన ఉదాహరణం.

"మాతృభాష తెలియని దేవుడు, మౌనభాష నేర్చుకున్నాడు
ప్రశ్నలు వేసుకోండి, సమాధానాలు చూచుకోండి
అన్నట్లు ప్రవర్తిస్తున్నాడు"

డాక్టర్ జె. బాపురెడ్డిగారు విస్తారంగా విదేశయాత్రలు చేశారు. ఆయా దేశాల్లో మనోరంగంలో మెరిసిన మెరుపులను ఇందులో మాలలల్లారు. జీవితంలోని అన్ని పార్శ్వాలనూ, అన్ని భావావస్థలనూ, అన్ని రసాలనూ బాపురెడ్డిగారు అభిమానంతో ఆవిష్కరిస్తారు. అందువల్ల ఈ సౌదామినీ కవితలు జీవితరంగాన్నంతా మెరుపుల వెల్లువలతో ముంచెత్తుతున్నాయి. ఇవి మరపురాని మెరుపులు.

ఆధునిక పాఠకుడు పరుగెత్తుతూ పొలుతాగేవాడు. అతనికి విస్తరకవితలు చదివే ఓపిక, తీరిక, ఆసక్తి అసలే లేవు. కాబట్టి, అతని కళ్లల్లో మెరుపులు మెరిపించే అక్షర విస్ఫులింగాల నందించాలి. డా॥ బాపురెడ్డిగారు సౌజన్యంతో సౌదామినులను అంతర్జాతీయ వేదికలమీద మెరిపిస్తున్నారు.

ఏదేశ మేగినా, ఎందు కాలిడినా, ఏ పీఠమెక్కినా, ఎవ్వరెదురైనా తెలుగు మెరుపు వెలుగునింపుతుందనటానికి ఈ కవితా సంపుటి అక్షరోదాహరణం. ఆటాలో అఖిలాంధ్ర ప్రజానీకానికి అంకితమౌతున్న ఈ కవితాసంపుటి ఆశాంతం మెరుపు నింపాలని మనసారా ఆశిస్తున్నాను! ఈ సుకృతిని అభినందిస్తున్నాను.

**- ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం**
ప్రముఖ విమర్శకులు

తెలుగుశాఖ,
హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం.

# మెరుపుల మాలిక

## 1. నిర్వచనం

ఆశ నాభాష
ఆలోచన నా శైలి
ఆవేశం నా శిల్పం
ఆనందం నా భావం
కవిత నా జీవితం

## 2. విద్య-మిధ్య

మనిషీ నీవు నేర్చుకుంది
మరచిపో అది మిధ్య
ఆపై మిగిలిందేదో
అదే అసలు విద్య!

## 3. గతాగతాలు

గతకాల కంకాళాన్ని చూచి
ఆగతకాల శిశువు కెవ్వుమంటున్నది
గతాగతాల, మృతామృతాల
గందరగోళాలమధ్య
నా గుండె రివ్వుమంటున్నది.

## 4. ఏమిటి జరిగినట్టు?

భూతకాలం పెరిగినట్టా
భావికాలం తరిగినట్టా
నూతన సంవత్సరం రావటం అంటే
ఏమిటి జరిగినట్టు?

## 5. మబ్బు - మనిషి!

మబ్బు ఎప్పుడు ఎక్కడ కురవాలో
తాను కోరుకోదు
కోరుకొనేది మనిషే

## 6. భార్యాభర్తలు

జీవితం అనే గడియారంలో
భార్యాభర్తలు రెండు ముళ్లు
కలిసికొంటూ విడిపోతున్నట్లు
విడిపోతూ కలిసికొంటున్నట్లు
జీవిస్తుంటారు
కాలచక్రంలో ఎప్పుడూ కలిసే ఉంటారు.

## 7. దీపం

నీవు గదిలో ప్రవేశించగానే
దీపం ఆరిపోయింది
తన అవసరం తీరిందన్నట్లు

## 8. అప్రమేయం

ఈ అబ్దాలు, దశాబ్దాలు, శతాబ్దాలు, యుగాలు
ఎక్కడ పూడ్చివేయబడుతున్నాయో!
అంతంలేని కాలం
అనాయాచితంగా అఖండధారగా
తనను త్రాగేస్తున్న దేశం దోసిటిలోకి
ఎక్కడ నుంచి దొరలి పడుతున్నదో!
ఎవరు చెప్పగలరు?

## 9. కర్మయోగి

దేశాన్ని భుజాన వేసుకొని
కదలి పోతుంది కాలం
ఎవరి కష్ట సుఖాలు వినిపించుకోదు
ఎక్కడా విశ్రాంతి తీసుకోదు!

## 10. తాగుబోతు

తాగుబోతు
తన భుజాల మీదే
తన పీనుగును మోస్తున్నాడు

## 11. పట్టు విడుపులు

పట్టుకొమ్మంటే పాముకు కోపం
విడిచి పెట్టమంటే డేగకు కోపం
పట్టు విడుపులు తెలిసిన యుక్తికే
పట్టుబడుతుంది విజయం

## 12. తీవ్రవాద భూతం

సమతాన్యాయ వేదాన్ని
సామాధి చేస్తే
తీవ్రవాద భూతంగా
అది తిరిగిరాక తప్పదు!

## 13. అల్లరి

పల్లవులు పాలించే
పాటల దేశంలో
'అల్లరి' ఎక్కువైపోతున్నది
'అర్థం' తక్కువై పోతున్నది

## 14. పార్వతీ పరమేశ్వరులు

వేప చెట్టు రావి చెట్టులాగ
పెనవేసుకుందాం
కాలి వ్రేళ్ళతో నేల పరుపును గిల్లుతూ
చేతి వ్రేళ్ళతో నింగి బుగ్గలు నిమురుతూ
పార్వతీ పరమేశ్వరుల వలె
పరవశించి పోదాం

## 15. చెట్ల రాకెట్లు

రాకెట్లలాంటి చెట్లు
నిటారుగా నిలబడి
నింగి వైపు చూస్తున్నాయి
ఊటీ కొండ లోయలో
ఎక్కడుందో అవి ఎగరటానికి నొక్కే మీట?
శ్రీహరికోట

## 16. కాలం కంపించింది

రంగులు పూచే చెట్ల మీద
రక్తం పూస్తున్నది
కాలమే కంపించి
కెవ్వున ఏడుస్తున్నది

## 17. సత్యార్థాలు

మనసులోని మాటలు
గుండె గూటిలోనుంచి ఎగసిపోయి
అంతరిక్ష నిఘంటువులో
అర్థాలు వెతుక్కుంటున్నవి
అనంతత్వ భావనలో
సత్యాలు తెలుసుకొంటున్నవి

## 18. మహోదయం

మార్తాండునికి మసిపూస్తే
మహోదయం ఆగుతుందా!
మైకులన్నీ తీసివేస్తే
మాట పలుకుట మానుతుందా!

## 19. పాతబడని అక్షరాలు

శబ్దాలు వాక్యాలు
కలసి కూర్చుకుంటున్న జీవిత గ్రంథాలు
పాతబడుతున్నా మూతబడుతున్నా
అక్షరాలు మాత్రం
సరిక్రొత్త శబ్దరూపాలు ధరించి
అనంత భావ సృష్టిలో
అలవోకగా ఆడుకుంటున్నాయి

## 20. మంచుకొండ

కొండమీద కొండబెట్టి
'ఏడుకొండలు' చేయలేవు
మంచుమీద మంచు పేర్చి
'మంచుకొండ'ను చేయలేవు.

## 21. మార్పు

సంహరణం కాదు చేయవలసింది
సంస్కరణం
మరణం కాదు కావలసింది
మార్పు!

## 22. కోకిలత్వం

కవిత్వాన్ని రాజకీయంచేసే
కాకితత్వం పోవాలి
రాజకీయాన్ని కూడా కవిత్వంచేసే
కోకిలత్వం రావాలి.

## 23. మధుపానం

కోతికి బ్రాందీ ఇస్తే గీతాపారాయణం చేయదు
కొంప లంటిస్తుంది
కోకిలకు మధువందిస్తే
హేమంతంలో కూడా కూస్తుంది
ఉత్తమగుణా లున్నవాడు
మత్తుగా తాగినా మంచిదే
చేతగాని వానికి మధుపానం
ఈతరాని వానికి సాగర ప్రాయం

## 24. అవతారం

"అమ్మ" అనే రెండక్షరాలు
గీసిన అనురాగాల బొమ్మలు మనుషులు
పుడితే అమ్మ కడుపులోనే పుట్టాలని
"స్వయంభువు" అయిన ఆదిదేవుడు కూడా
అమ్మ ప్రేమ అనుభూతి కోసం
అవతారం అనే నెపంతో
అమ్మ కడుపులో పుట్టాడు

## 25. కన్నీటి వరదలు

శాంత విప్లవం విఫలమైతే
సాయుధ విప్లవం తప్పదు
కడలి పాలయ్యే నీళ్లకు
ఆనకట్టలు కట్టకుంటే
అడవి పాలయ్యే బ్రతుకుల
కన్నీటి వరదలు తప్పవు

## 26. జాతిగుణం

మన జాతి పక్షి నెమలి గదా
మన జాతి సుమం పద్మం కదా
మన జాతి 'గుణం' ఏమిటంటే
'మోసం' అని చెప్పుకుంటే
ముచ్చటగా ఉంటుందేమో!

## 27. దిగంతరేఖ

తెగిపోయిన దిగంత రేఖ మాత్రమే తెలుపుతుంది
పర్వతాలు మన చుట్టూ
పరిరక్షక భటులై ఉన్నాయని

## 28. తోక పోయింది

నీవీపును కాపాడడానికి
కర్మేంద్రియాంగం ఏదీ లేదు
ఉన్న ఒక్క తోకను
ఊడబెరికింది కాలం

## 29. పేరు తెలియదు

తెలుగువాని పేరేమిటంటే
తెలియదనండి
ఎందుకంటే, మేము
ఒకరినొకరం గుర్తించలేమనండి

## 30. మానవ హృదయం

అనంతాన్ని సృష్టించిన
ఆదిదేవు డుండుటకు
మానవ హృదయం తప్ప
మరో చోటు లేదురా!

## 31. నిజం

జ్ఞాపక శక్తి లేని వాళ్ళు
అబద్ధాలు ఆడకూడదు
నిష్ఠూరానికి జడిసే వాళ్ళు
నిజం చెప్ప కూడదు
ఔచిత్యం తెలియని వాళ్ళు
అసలు నోరు విప్పకూడదు

## 32. పిచ్చివాడు

పెంటలో పారేసిన
కాగితపు ముక్కల్ని
ఓ పిచ్చివాడు ఏరుకుంటున్నాడు
తన మతి పోగొట్టిన వాని అడ్రస్
వాటి మీద రాసి ఉందేమో అని!

## 33. ఆస్తికులు

ఆస్తిపాస్తులున్నవారు ఆస్తికులు
అవేవీ లేని వాళ్ళు నాస్తికులు
"నా అన్నది లేని వాళ్ళే
నాస్తికులై పోతున్నారు"
అన్న నగ్న సత్యాన్ని గ్రహిస్తే
అందరూ ఆస్తికులయ్యే
అభ్యుదయం తేవచ్చు

## 34. నిద్ర

నిద్రంటే నాకు
నిస్తుల ప్రేమ
అవి కలల తోటకు బాట
మృత్యువు ఎంతటి అభయార్ణవమో
ఉపపాదించే ఉపమానించే ఊయల పాట

## 35. కుహనా మేధస్సు

కోకిల పాటల పరీక్ష కాకులు చేస్తుంటే
నవ్వుల పువ్వుల పరీక్ష నాపరాళ్ళు చేస్తున్నవి
గగన వీధి చుక్కకన్న
గాజు పెంకు పెద్దదని
వాదించే మేధావులు
వెలుగుతున్న లోకంలో
'వెలుగు' బ్రతుక గలదా!

## 36. పుస్తకం

అక్షరాకాశంలో పొడిచిన
తొలి ప్రొద్దు పుస్తకం
శబ్ద సరోవరంలో విరిసిన
తొలి శత పత్రం పుస్తకం
శిలల మీద శ్రీకారం దిద్దిన అక్షరం
ఆకుల మీద ఆకరం దాల్చిన శబ్దం
తమ విశ్వరూపాన్ని ప్రదర్శిస్తున్నవి
అంతరిక్షాన్ని జయిస్తున్నవి

## 37. పెండ్యూలం

పుట్టినప్పటి నుంచీ
నేను కాలాన్ని పట్టుక వ్రేలాడుతున్నాను
వెలుగునుండి చీకటిలోకి
చీకటి నుండి వెలుగులోకి
నిర్విరామంగా ఊగుతున్నాను
పెండ్యూలంలా

## 38. నిర్నిద్ర శక్తి

పుస్తకాలకు నిదుర లేదు
రేయింబవళ్లు రెక్కలార్చే పక్షు లవి
లోకం నిద్రిస్తున్నా
గ్రంథాలు మేల్కొనే ఉంటాయి
కలాలు పట్టుకొని
కాలం పోకడలు కనిపెడుతూనే ఉంటాయి

## 39. చలిపులి

చలిపెడుతూంది చెలీ! అంటే
రగ్గు కప్పుకొమ్మన్నావు
అగ్గితో తీరని చలి రగ్గుతో తీరుతుందా?
చలి అంటే నాకు చచ్చేటంత భయం
అందుకే నీ అండ చేరింది
అభయ హస్తం పట్టు
నా కండరాలను కొరికేస్తున్న
చలిపులిని త్రిప్పికొట్టు!

## 40. తారుమారు

ఒకప్పుడు చీకటికి
వెలుతురు బుద్ధి చెప్పేది
ఇప్పుడు వెలుతురుకే
చీకటి విద్య నేర్పిస్తూంది
అప్పుడు త్యాగం స్వార్థాన్ని ఖండించేది
ఇప్పుడు స్వార్థం త్యాగాన్ని దండిస్తూంది

## 41. చితా భస్మం

ప్రచండ సూర్య మండల కాష్ఠంలో
దహన సంస్కారం పొందిన
గత చరిత్రల చితా భస్మాలను
కాల బ్రహ్మ కలిపివేస్తున్నాడు
పవిత్రాకాశపయోనిధిలో

## 42. ఉక్కిరి బిక్కిరి

ఛందస్సు వదలని సంప్రదాయ పద్యం లాంటి
సంగీతం లేక కదలని శాస్త్రీయ గేయం లాంటి
ప్రియునికోసం అన్వేషిస్తున్న నన్ను
వచన కవిత్వంలా వచ్చి పట్టుకున్నావు
పల్లవి లేని నీ వలపు పాటలు
నియమంలేని నీ పద్య పాదాలు
అలంకారాలు లేని నీ అయోమయ భావాలు
నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి
ముక్కలు ముక్కలుగా కోస్తున్నాయి

## 43. జీవితం

జీవితం
జనన మరణాల మధ్య
కాలం వ్రేలాడ గట్టిన కాంతిరేఖ
జననం ఒక మరణం లేని ప్రశ్న
మరణం ఒక జననం లేని ప్రశ్న
సమాధానం లేని రెండు సంపూర్ణ ప్రశ్నలకు
సమాధానం చెప్పడానికి
సందేహాల బోనులో నిలబడ్డ
సాక్షిలాంటిది జీవితం
అబద్ధం చెప్పదు - సత్యం తెలియదు

## 44. అర్థ సూత్రం

అర్థం కానిదేదో - అర్థం లేనిదేదో
తెలియజాలని పదార్థం నేటి కవిత
అర్థంలేదని అర్థమైనా చాలు
అర్థం కాని అర్థముందని అర్థమైనా మేలు
అర్థముందని అర్థమైతే పదివేలు
అర్థం కాకుండా వ్రాయాలన్న
నా ప్రయత్నం వ్యర్థమైంది

## 45. అక్షరానుభూతి

ఓనమాలు
నా చేతి వ్రేళ్ళ కొసల నుండి ఒలికి పడ్డప్పుడు
నల్లని పలక మీద పరచిన ఎర్రని ఇటుక మట్టిలో
ఇంద్రనీలాలు ఆవిష్కృతమైనప్పుడు
పొందిన ఆనందానుభూతి
బాల్యానికి మాత్రమే అందే బ్రహ్మానుభూతి

## 46. ఆత్మహత్య

చావదలచుకున్నవారికి
కావలసింది
ఆత్మ జ్ఞానం కాదు
ఆత్మ హత్య
బ్రతకాలనుకున్న వారికి తెలియవలసింది
బ్రహ్మ సూత్రాలు కాదు
ఆరోగ్యసూత్రాలు

## 47. నోబెల్ బహుమతి

తిట్టుటయే కవిత అయితే
మనదే నోబెల్ బహుమతి
కీచులాట క్రీడ అయితే
మనదే ఓలంపిక్ పతకం

## 48. సంజీవిని

క్యాన్సర్‌కు ఆన్సర్ కనిపెట్టాడు ఓ తెలుగుబిడ్డ
సంజీవిని పట్టుకొచ్చిన ఆంజనేయత్వాన్ని
అభినందిస్తున్నది అశ్వినీదేవత
గర్విస్తున్నది భరతమాత

## 49. పెళ్లి - తల్లి

ఒక ధనుర్భంగంలో జరిగింది
జానకి పెళ్లి
ఒక తపోభంగంతో అయింది
మేనక తల్లి

## 50. శిల్పులు

నాతిని రాతిగ జేసే
కామేంద్రులు అల్పులు
రాతిని నాతిగ జేసే
రామచంద్రులు శిల్పులు

## 51. ఆహ్వానం

అగుపించే వాస్తవాల వెనుక
అనుభూతి సత్యాలను చూద్దాం
అగుపించని అనంతత్వంలోని
ఆనంద తత్వాన్ని ఆవిష్కరిద్దాం
రండి! అందరూ రండి!
ఎంత త్రాగినా తనివి తీరని వింత రసాస్వాదనకు
ఏ విజ్ఞాన శాఖ వివరియలేని పరిమళోపాసనకు
రండి! ఇంకా దగ్గరగా రండి
లోనికి లోలోనికి
నా గుండెలోనికి రండి!

## 52. మానవుడు

నాయకుడగాను
అనునాయకుడగాను
మానవుని ప్రేమించు
మానవుడ నేను

## 53. గానలీల

శ్రీమతి లీలానాథ్ నోట
గానసరస్వతి పాడిన పాట
ఆకాశవాణిని అలరించింది
శిలలనుకూడా శివమెత్తించింది
ఈ శిశిరాన్ని వసంతంగా మలిచింది

## 54. అంగీకారం

ఏనాటికైన ఔనంటావులే
అందాక నే వేచి యుంటానులే
నీ పేరు నా శ్వాసలో శ్వాసగా
ఓ ప్రియా శృతి చేసుకుంటానులే!

## 55. జనన మరణాలు

దేవుడిస్తాడు జన్మం
జీవితం దాని వెంటబడి
చేస్తుంది మరణం

## 56. పాట మహిమ

కొమ్మమీది ఓ కోకిలపాట
నా గుండెగూటిలో దూరింది
ఆకులు రాలిన నా బ్రతుకంతా
ఆమనిగా మారింది.

## 57. చీకటి

సూర్యునికి
చీకటిని చూపలేం
చీకటితో చీకటిని బాపలేం

## 58. నీరు-కన్నీరు

ఒంటిని శుద్ధిచేసేది నీరు
మనసును పరిశుద్ధం చేసేది
కన్నీరు

## 59. ఉగాది

గతకాలము
ఆగతకాలమునకు
స్వాగతగీతము పాడు
ఈ ఉగాదినాడు

## 60. కాలజ్ఞానం

మరణానికే తెలుస్తుంది
మనిషి జీవిత కాలం

## 61. మత్తు

అందాన్ని చూచే కళ్ళు
ఎందుకిచ్చాడో నాకు దేవుడు
అసలే మతిలేని వాణ్ణి
నాకు మత్తెందుకు పెట్టాడో!

## 62. చిత్రమైన శిశువు

అంతరిక్ష కవిని నేను
ఆనంద రవిని నేను
దేశ కాలాలు అనే బొమ్మలతో
ఆడుకొనే
చిత్రమైన శిశువును నేను

## 63. మృత్యువు!

అందరూ ఏవేవో వరిస్తారు
మృత్యువుమాత్రం అందరినీ వరిస్తుంది.

## 64. వెలుగు చీకటి

వెలుతురు చీకటిని
వెంటాడుతుంది
చిత్రమేమిటంటే
చీకటి
వెలుతురు వెనకాలే దాక్కుంటుంది

## 65. భయం

నేను భయపడేది ఎవరికో కాదు
నాకే
నాకు నేనే శత్రువైతే
నను రక్షించే నాధు డెవరు

## 66. కష్టసుఖాలు

కష్టా లంటే భయపడేవారికి
సుఖం లేదు
సుఖం ముఖం చూడనివారికి
కష్టం లేదు.

## 67. సువాసన

దేశభక్తి త్యాగశక్తి
దీపించే ఋతువు ఉంటే
నేల పులకరిస్తుంది
గాలి పరిమళిస్తుంది!

## 68. ఆత్మగౌరవం

కవితకు
కుదింపులోనే ఇంపుంది
అనవసరంగా మాటపడని
ఆత్మ గౌరవం ఉంది

## 69. ఆభాసా

సౌందర్యం మాయ అయితే
నాకు మాయే కావాలి
జీవితం స్వప్నమే అయితే
నాకు స్వప్నమే కావాలి.

## 70. సౌకుమార్యం

ఆమె చేతివ్రేళ్ల సౌకుమార్యం
తాకగానే
బిగుసుకపోయిన తీగెలలో నినాదవేదాలు
నిదురలేచాయి

## 71. నీ జన్మదినం

నీ జీవిత యాత్రలో
నిన్ను అభినందించడానికి వచ్చే
నీ జన్మదినం
కాలానికి దారిచూపే
వసంత కోకిల
గతాగతాల దిక్సూచి

## 72. నేను ఒంటరిని కాదు

నేను ఒంటరిని కాదు
బ్రతికినంతకాలం
నా వెంట భగవంతుడుంటాడు
చచ్చిపోయిన క్షణం నుంచి
మృత్యు దేవతవెంట నేనుంటాను

## 73. ముద్దు

నాకున్నవన్నీ
ముద్దేకాని
నీ ముద్దే నాకు వద్దా!

## 74. సీత

అయోధ్య వాసమైనా
అరణ్య వాసమైనా
చీకుచింతలే తోడైన
సీత గుండె కోతను నేను

## 75. గుర్తులు

తగ్గుతున్న కంటి చూపుతో
మగ్గుతున్న నా ఒంటిని పరిశీలించాను
ఇంటిని ఖాళీ చేయడానికి
యజమాని గుట్టుగా మూటా ముల్లె సద్దుకుంటున్న
గుర్తులు గమనించాను

## 76. ఇరవయ్యో శతాబ్దం

కరడుకట్టిన కాలాన్ని
కరిగించిన విప్లవజ్వాల
ఇరువయ్యో శతాబ్దం

## 77. మధ్యంతరం

అక్షరానికి అక్షరానికి మధ్య
అంతరిక్షం ఆవులిస్తూంది
శబ్దానికి శబ్దానికి మధ్య
శూన్యం అవరిస్తూంది

## 78. శిశిరం

ఎండ దెబ్బకు గుండె నిబ్బరం కోల్పోయినవసంతం
పండుగ చేసుకోనంటున్నది
స్వార్థాన్ని స్వంతం చేసుకున్న శిశిరం
సెలవు తీసుకోనంటున్నది.

## 79. నాగీతాలు

మింటి ఇంటి ముంగిట్లో
మ్యావు మ్యావుమని తిరిగే
మార్జాల పర్జన్యాలకు
వీరగర్జనలు నేర్పే
విప్లవ మారుతాలు నా గీతాలు

## 80. పరిచయం

సంచులిస్తేనే
సౌభ్రాతృత్వం
పైసా లేకుంటే పరిచయం లేదు

## 81. అశ్రువులు

నా అంతరిక్ష పరిశోధన
నా అంతరంగం చిమ్మే
అశ్రువుల్ని ఆపలేకపోతున్నది

## 82. పడవ మునకలు

ఎన్నికలలో ఎన్నికలలో
ఒక్క చేపకై ఎన్ని వలలో
ఓటర్ల మహా సముద్రంలో
ఎన్ని అవినీతి అలలో ఎన్ని ఆవేశాల సుడిగుండాలో
ఎన్ని ఆగ్రహాల తిమింగలాలో
ఎన్ని అభ్యర్థుల పడవ మునకలో!

## 83. అవార్డు

నాకేమీ తెలియనప్పుడు
అవార్డులన్నీ ఇచ్చారని
ఇప్పుడు తెలుస్తూంది
ఆ తెలియట మొక్కటే
నాకు అర్హతగల అవార్డు

## 84. ముసుగు

పరమమూర్ఖులూ
పశుప్రాయులూ అయిన
మగవాళ్ల ముఖాలు చూడగూడదని
ముసుగు వేసుకున్నారు
సత్యాగ్రహిణులైన
కొందరు నారీమణులు

## 85. పలకరించు

పేదవాళ్లను పెదవులో
ధనికుల్ని ధనంతో
పలకరిస్తారు

## 86. నీటి బిందువులు

గాలిలో చిక్కుపడ్డ నీటిబిందువులు
ఇంద్రధనుస్సుతో ఆడుకుంటాయి
రంగురంగుల కలల రంగవల్లికలు
తీర్చుకుంటాయి

## 87. సలహా

కవిత వ్రాస్తూ కూర్చో
కష్ట నష్టాలు మరిచిపో!
సలహా ఇచ్చాడు ఒక సంపన్నుడు
నా చిరకాల మిత్ర వతంసుడు

## 88. పీడకల

కాలపు చెక్కిళ్లమీద
ఆకాశం రాల్చే కన్నీటిచుక్కల చూచి
కెవ్వున కేక వేశాను
పీడకల కన్న పసిపాపలా

## 89. నిర్వికారం

పుట్టుకకు స్వాగతం పలికినట్లే
గిట్టుటకు వీడ్కోలు చెపుతుంది
మట్టిలో పుట్టినవన్నీ
మటుమాయమై పోతున్నా
తన కేమీ పట్టనట్లు కన్నీరైనా పెట్టనట్లు
కలాన్ని చంకనెత్తుకొని
కదిలి పోతుంది దేశం

## 90. అంతరంగం

గాలి తాకిడికి కడలితరంగంలా
నీ తలపు తాకిడికి నా అంతరంగం
అల్లల్లాడిపోతున్నది

## 91. మిన్న

ప్రియా
బుసకొట్టే నీ భుజదండాలకంటే
సొమ్మసిల్లే నా సోగకనులే మిన్న
నీ తరగలెత్తిన శక్తిసింధువులకంటే
నా నుదుట పూచిన చెమటబిందువులే మిన్న

## 92. పేరు ప్రతిష్ఠలు

కవిత్వానికి పేరు పెట్టుకొంటే
అది పేరుకు మాత్రమే కవిత అవుతుంది
రాసేది అసలైన కవిత అయితే
దాని కదే పేరు తెచ్చుకుంటుంది

## 93. మెరుపు సంతకాలు

మబ్బు కాగితాల మీద
మెరుపు సంతకాలు
విపిన తమోవీధుల్లో
వెరపు జీవితాలు

## 94. ఆత్మజ్ఞానం

రాళ్లు మాట్లాడుతాయి
వినగలిగే చెవులుంటే
కాలగర్భంలో దాగిన రహస్యాలు కనబడతాయి
కనగలిగే కళ్లుంటే
అందుకే
అజ్ఞానేంద్రియాలకు ఆత్మజ్ఞానం నేర్పించు!

## 95. అసుర తత్వం

భగ్నత్వం పాటపాడుతుంటే
నగ్నత్వం నాట్యమాడుతుంటే
చెవులు మిటకరిస్తుంది
పళ్లికిలిస్తుంది
శిశిరత్వం - అసుర తత్వం

## 96. రెంటికి చెడ్డ రేవడు

శాశ్వతమైన సత్యాన్ని
తాత్కాలికంగా అనుభవించడం
జీవితం
అందుకోలేని అక్షరత్వం కోసం
అందిన క్షణికాన్ని వదులుకొనేవాడు
రెంటికి చెడ్డ రేవడు

## 97. సత్య వైవిధ్యం

సత్యవైవిధ్యాన్ని
నిత్య నైవేద్యంగా
సాహిత్య సరస్వతికి
సమర్పిస్తున్నాను.

## 98. ప్రశ్నల పత్రం

జీవితం ఒక పరిక్షా ప్రశ్నల పత్రం
సమాధానాలు తెలిసినా
నియమిత సమయంలోనే వ్రాయలేకపోతే
నీవు ప్రశ్నగానే మింగిపోతావు!

## 99. కటికంకటి

నీ కటికంకటిపై
నిదురించే స్వప్నం నేను
నా హృదయడమరుకంలో
నినదించే సత్యం నీవు

## 100. చిట్టెలుక

పట్టరాని పురిటినొప్పులుపడ్డ
పర్వతం
ఎట్టకేలకు ప్రసవించింది
ఒక చిట్టెలుకను

## 101. చిత్ర పరిశ్రమ

మనిషికి
చలనచిత్రాలు చలనం కలిగించడం లేదు
ఛాయాచిత్రాలు నీడ కల్పించడం లేదు
విచిత్రమైన చిక్కులో
చిత్రపరిశ్రమ చిక్కుకుంది

## 102. సృష్టికి శోభ

భువిజాడ నేనే దివిజాడ నేనే
మనుజాడ నేనే దనుజడ నేనే
పరిణామ ద్వంద్వ ప్రకృతిని నేనే
శూన్యజ సృష్టికి శోభను నేనే!

## 103. స్వభావ కవి

ఎవరి ప్రభావానికి
ఎవరి ముభావానికి
గురికాని
స్వభావ కవి ఆయన
మంచి భావం ఆయన్ని పలికిస్తుంది
మంచితనం ఆయన్ని కదిలిస్తుంది
మంచి మాట ఆయన్ని కరిగిస్తుంది

## 104. సెన్సారు బోర్డు

ఆపాద మస్తకాలింగనం
ఆమూల చుంబితాధరం
అర్ధనగ్న పూర్ణనగ్న అశ్లీలాన్ని
సిగ్గువిడిచి ప్రదర్శించే సినీమాలను చూచి
సిగ్గుతో కళ్లుమూసుకుంటూంది సెన్సారుబోర్డు

## 105. విధి

బ్రతుకంటే భయమెందుకు
మృత్యువంటే బెదురెందుకు
నీవు చావవలసిన రోజు
ఏ వైద్యం, ఏ వైద్యుడూ
నిన్ను తప్పించలేవు
అలా జరగకూడదనినాడు
ఈ లోకమంతా ఏకమైనా
నీ పీక పిసికేయలేవు

## 106. ప్రతిభ - సాహసం

ప్రతిభను పిరికితనం
పట్టి పీడిస్తూంది
స్వార్థాన్ని సాహసం
ఉసికొట్టి గెలిపిస్తూంది

## 107. పంచభూతాలు

గాలి,నీరు, గగనంవంటి
పంచభూతాలపట్ల
నీకు భయభ్రాంతు లెందుకు
నీ ఒంటిని రక్షించే
ఉద్ధతులు అవేకదా!

## 108. నడకలు

ప్రబంధ కవులు వర్ణించిన
నాయికల నడకలన్నీ
నీ పాదాలకు
అభివాదాలంటున్నవి

## 109. మనిషిగా ప్రవర్తించు

బుద్ధుడు, క్రీస్తు, మహ్మద్
ఇంకెందరు చెప్పాలి
నీవు మనిషిగా ప్రవర్తించుమని

## 110. అడవి పాలు

అడవిలో చిక్కుకుంది
అధికార యంత్రాంగం
మతిలేని మంత్రాంగం
ఆవేశాల రథాంగం

## 111. తీరని శంక

ఓ భగవంతుడా
నీవు ఎత్తలేని మూట నీవు కట్టగలవా
ఔనంటే నీ శక్తిని శంకిస్తాను
కాదంటే నీవూ శక్తిహీనుడవని ప్రకటిస్తాను
పరిమిత శక్తి గల నిన్ను
పరమాత్ముడని నమ్ముకొనే దెలా!

## 112. దేవుని దయ

రాజును చూచినప్పుడు అనిపిస్తుంది
దేవుని దయ ఉంటే నేనుకూడా రాజునయ్యే వాడినని
మరి బిచ్చగాని చూచినప్పుడు
అనుకోవాలిగా
దేవుని దయలేకుంటే నేనూ అలాగే ఉండేవాణ్ణని

## 113. పారవశ్యం

ప్రతిఋతువూ పులకింపచేసే
కవిత్వాన్ని నా పారవశ్యం పలికిస్తున్నది

## 114. తుఫాను

ప్రకృతి శక్తులన్నీ దీపిస్తున్న
రూపం నీవేకదా!
నీ ఉచ్ఛ్వాసంలోనే తుపాను
నిదుర లేస్తుంది కదా!

## 115. కోకిలలు

ఓహో! ఆహో! అనగానే
ఉప్పొంగి పోకు
కుహూ కుహూ మనేవన్నీ
కోకిలలనుకోకు

## 116. ఉగాది

ఉగాదిని ఏగాదిగ చూచి
ఓహో! ఆహో లో పడకు
పచ్చడి మీద ముచ్చట పడి
ప్రశంసా పత్రాలు ఇడకు!

## 117. పర్యవసానం

నిప్పుకు చెద పట్టినప్పుడు
నీటిలో మంటలు పుట్టనపుడు
విప్లవం వర్ధిల్లినట్లా
వినాశనం ఘూర్ణిల్లినట్లా!

## 118. మతం

ప్రతి మనిషీ దేవుని ప్రతి రూపమే
ప్రతి వ్యక్తీ ఏకైక మూల శక్తి దీపమే
అంటూ చాటించిన సత్యమే మతం
సత్యం దేవుడైతే
చాటింపు మతం అయింది

## 119. జనారణ్యం

ఓ ఆమనీ!
అరణ్యంలో నుంచి
జనారణ్యంలోనికిరా!
ఆవేశంలో నుంచి కాస్త
ఆలోచనలోనికిరా!

## 120. ఒకేభక్తి ఒకేశక్తి

ఒక దేవుణ్ని చంపి
మరొక దేవున్ని బ్రతికించలేం
ఒక మతాన్ని ఓడించి
మరొక మతాన్ని గెలిపించలేం
మందిరమైనా మసీదైనా
చెర్చి అయినా గురుద్వార అయినా
అక్కడ మనిషి సమర్పించే భక్తి ఒకటే
సాధించే శక్తి ఒకటే

## 121. కులమతాలు

పుట్టిన వారందరి తీరొకటే
గిట్టిన వారందరి దారొకటే
మధ్యలో మనకు మనం పులుముకుంటున్న
మలినం కులతత్వం
చేసుకుంటున్న మోసం మతమౌఢ్యం

## 122. నిస్సహాయత

ఈ రోడ్లు నా జీవిత కాలాన్ని
కొలువలేవు
ఈ గాలి నా ఊపిరుల జాడ
కనుక్కో లేదు
ఈ వెలుతురు నా దృష్టికి
పుష్టి చేకూర్చలేదు

## 123. నేను

చీకటి కూకటి వ్రేళ్ళను
పెకిలించే కిరణాన్ని నేను
గుడ్లగూబల గుండెల్లో గునపాన్ని నేను

## 124. ఒయాసిస్సు

ఏడు సముద్రాలను కలిపే
గాలిపడవను నేను
ఎడారుల ఊపిరి నిలిపే
ఒయాసిస్సును నేను

## 125. అసలు విషయం

అక్షరాలు ఆత్మగా
శబ్దాలు శరీరంగా
వాక్యాలు ఆలోచనలుగా
భావాలు లక్ష్యంగా
జీవిస్తున్నాను నేను

## 126. అద్వైతార్థం

కుచేలునితో కుబేరుడు
"త్వమేవాహం సహోదరా" అంటూ
తాదాత్మ్యం చెందినపుడే
అద్వైత వేదాంతానికి
అర్థం సంక్రమిస్తుంది
ప్రజాస్వామ్య వ్యవస్థలో
పరమార్థం పరిమళిస్తుంది

## 127. కాంతి కళ్లెం

చుక్కలకు రెక్కలు తొడిగి
శూన్యంలోకి ఎగరవేస్తున్నాను
కాలానికి కాంతి కళ్లెం వేసి
దేశమంతా త్రిప్పుతున్నాను

## 128. మండేలా

మానవత్వపు గుండెల్లో
మండే లావా మండేలా అని
దానవత్వం గ్రహించింది
రక్షించే రంగులు హంగులు లేవని
దక్షిణాఫ్రికాలో డేరా వేసిన
రాక్షసత్వం తలవంచింది

## 129. భావం ముఖ్యం

భాషలు
మాట్లాడుకోవడానికి
కొట్లాడుకోవడానికి కాదు
ఏ భాషలో అన్నది కాదు
ఏమి మాట్లాడుతున్నది ముఖ్యం

## 130. సత్యసాయి

పుట్టపర్తిలో సత్య సుందర మూర్తి
చరిత్ర పుటల్లో స్వర్ణాక్షర కీర్తి
నరహరులొకటై వెలిసిన స్ఫూర్తి

## 131. కవితా వస్తువు

సర్వాంతర్యామి స్వార్థం
సర్వకళాకోవిద స్వార్థం
సర్వార్థ సముపార్జని స్వార్థం
కామ రూపిణి స్వార్థం
కళ్లున్నా లేకున్నా కనిపించే యదార్థం స్వార్థం
నా కవితా వస్తువై కూర్చుంది!

## 132. మరువలేను

ఎంత వేదాంతం వల్లించినా
ఎంత సారూప్యం చూపించినా
నిన్ను మాత్రం మరవలేక పోతున్నాను.

## 133. చితికిపోతున్న వాగ్దేవి

కవితా కన్యకు రంగులు దిద్దే
అలంకార శాస్త్రం
"నేనే కవిత" నని ఘోషిస్తుంటే
చితికి పోతున్న వాగ్దేవిని
బ్రతికించేదెట్లా!

## 134. నా కవితలు

నా కవితలు
ఆకలి లేని పికాలు
నిదురపోని శుకాలు
రాలిపోని లతాంతాలు
వాడిపోని వసంతాలు

## 135. జీవితం

ప్రేమం కామం పెనవేసుకున్న
నిత్య సత్యం జీవితం
నింగినీ నేలనూ కలిపే
దిక్కులేని దిక్చక్రం జీవితం.

## 136. శృంగార ప్రబంధం

అహల్యతో కూడిన ఇంద్రుడు
తార కౌగిలి చేరిన చంద్రుడు
నాడు నడిపిన శృంగార ప్రబంధం
నేటికి చిలుకుతూంది ఉన్మత్తగంధం

## 137. మోసం

బాటసారి ఎవరో
వేటగాడు ఎవరో
గుర్తించని పక్షులు
గురి అయినాయి తుపాకికి

## 138. పరలోకప్రాప్తి

ఇహలోకంలో పుట్టడం
పరలోక ప్రాప్తి కోసమే అయితే
ఇహ పరాల మధ్య దూరం
ఎంతుందో కనుక్కుంటున్నాను
సరాసరి అక్కడే పుట్టే
సదవకాశం వెతుక్కుంటున్నాను

## 139. దయామయుడు

కళ్లున్న వాళ్ళకు కళ్లు లేని వాళ్ళ
కష్టాలు కనిపించవు
కలిమి గల వాళ్ళను
నిరుపేదల కన్నీళ్ళు కరిగించవు
కలిమిలేని కళ్ళులేని వాళ్ల కలలకు
రూపం కల్పించే కళాకోవిదుడెవరో!

## 140. మౌనభాష

మాతృభాష తెలియని దేవుడు
మౌనభాష నేర్చుకున్నాడు
ప్రశ్నలు వేసుకోండి
సమాదానాలు చూసుకోండి
అన్నట్లు ప్రవర్తిస్తున్నాడు

## 141. అమ్మ

సృష్టి రహస్యం తెలిసిన పరమేష్టి అమ్మ
దైవత్వానికి మానవత్వం నేర్పే దయామయి అమ్మ
కొండకు కడలి గుండెకు మధ్య
తరగలెత్తే రసానుభూతి
జీవన గీతి
అమ్మ

## 142. ధరలు

ఈ దేశంలో ధరలు పెరుగుతున్నాయంటే
నేను ఒప్పుకోను
వస్తువుల విలువలు పెరుగుతున్నాయి
మనుషుల విలువలు తరుగుతున్నాయి
సగటులో మార్పు లేదు

## 143. పెరుగు - తరుగు

ఉత్పత్తులు పెరగటం లేదనటం
యథార్థం కాదు
సరకుల ఉత్పత్తి సేవల ఉత్పత్తి తరగవచ్చు
కాని జనాభా ఉత్పత్తి ఎన్నోరెట్లు పెరుగుతూంది
"సగటు" పరిస్థితి సంతృప్తికరంగానే ఉంది

## 144. విప్లవ సూర్యుడు

కర్కట మకర రేఖల మధ్యే కాలక్షేపం చేయక
శీతలబాధావాతాలను అరికట్టి
ఉభయ ధ్రువాలనుచుట్టు ముట్టి
విశ్వంభర ఒడినిండా
వెచ్చదనం పచ్చదనం నింపే
విప్లవ సూర్యుని కోసం
వినువీధుల్లో శోధిస్తున్నాను.

## 145. గోవిందుడు

శాంతిని సాహిత్యం చేసి
సత్యాన్ని సంగీతంగా కూర్చి
నవయుగ గీతికానాదం వినిపించే
గోవిందుని కోసం నలుదిక్కులు వెదుకుతున్నాను

## 146. అదృష్టవంతులు

చచ్చిన వాళ్లకు శుభాకాంక్షలు
వాళ్లకే సమస్యలు లేవు
ఎవరి సహాయం అక్కరలేదు
ఎవరి సానుభూతితో పనిలేదు

## 147. నక్షత్రాలు

దినమంతా కష్టపడ్డ కార్మికులు
రాత్రి కన్న కలల పంట వలె
ఆకాశ క్షేత్రంలో
నక్షత్రాలు పండాయి

## 148. ఉన్నది లేనిది

ఉన్నదాన్ని ఉపేక్షిస్తే
లేనిదేదో లేచిరాదు
కన్నదానిని కాదనంటే
కానలేనిది కానరాదు

## 149. నింగికోట

నెత్తిమీద నేను కట్టుకున్న
నీలాల నింగి కోట
కాలం చేసిన మాయదాడిలో
నేలమీద రాలిపోతున్నది

## 150. నవగ్రహనాట్యం

సూర్యదీపం చుట్టు
సౌర మండలములో
నవగ్రహ నర్తకులు
నాట్యమాడేరు

## 151. మణులు - రాళ్లు

బండరాళ్ళకు గుడులు కట్టే
భక్తులను గని కోపగించకు!
మనిషి పుట్టకముందు పుట్టిన
మణులు రాళ్ళని విస్మరించకు!

## 152. ఆమనులు

ఆరాళ వేణీ
మరాళ యానా
నీ అడుగు అడుగులో ఆమనులేనా!

## 153. మేఘదూతికలు

సాగరుడు
మేఘ దూతికలను పంపి
తన ప్రియురాండ్రైన
నదీ కాంతలను
పిలిపించుకుంటాడు
తన ప్రేమాంకంలోకి

## 154. చుక్కల చూపులు

సుందరమైన కలల కోటలో
బందీనై పోయాను
లోతు తెలియని లోతుల్లో దిగి
పాతుకపోయాను
నా తలమీది నగ్నాకాశం
నన్ను చూచి నవ్వింది
భావమేమిటో అర్థం కాని
చుక్కల చూపులు రువ్వింది

## 155. అర్థాల్లో స్వార్థాలు

కోకిలమ్మ కుహు కుహులకు
కోటి కోటి అర్థాలు
తీరు తీరు అర్థాల్లో
వారి వారి స్వార్థాలు

## 156. నీవూ నేనే

ఊపు ఊపు నీ ఒళ్లంతా
చూపుచూపు నీ సొగసంతా
పూవుల తావుల పులకరింతలో
నీవూ నేనే జగమంతా!

## 157. అర్భకుడు

అనుభవించినదాన్ని
అభివ్యక్తం చేయలేని
అర్భకుణ్ణి నేను
అభాగ్యుణ్ణి నేను

## 158. కనువిప్పు

తప్పేదో ఒప్పేదో
చెప్పే వారెవరో!
కప్పిన నా కనుల పొరలు
విప్పే వారెవరో!

## 159. కదిలే శిల

అలలో అలవై కదలాలంటే
అదరని శిలవై నిలవాలి
కదిలే శిలగా మెదలాలంటే
అలలో అలవై నిలవాలి!

## 160. పరిమితులు

ఎవరో వెంటబడి తరుముతున్నట్లు
పరుగెత్తి వచ్చే కడలి కెరటాలు
అడ్డంగా నిలిచిన తీరాన్ని దాటలేక
నురుగులు గ్రక్కుతూ పడిపోయే దృశ్యాలు
గుండెల్ని కరిగించి వేస్తాయి
బ్రతుకులోని పరిమితుల్ని జ్ఞాపకం చేస్తాయి

## 161. మౌనవ్రత!

తిరిగే చక్రాల క్రింద
నడిచే పాదాల క్రింద
నలిగి పోతుంది రోడ్డు
గమ్యం చేరుకోవడానికి దారి చూపినందుకా
తాను చేసిన తప్పేమని
నిలదీయలేనందుకా!

## 162. రాజయోగం

అబూశైల శిఖరాల మీద
ఆత్మజ్ఞానం ఉదయిస్తూంది
మనిషిలోని ఇంద్రియాల
మాయ చీకటి నిష్క్రమిస్తుంది
జీవాత్మకు పరమాత్మకు
రాజయోగం కుదురుతూంది
భూలోకాన్ని మళ్లీ సత్యయుగం దర్శించే
సన్నాహం జరుగుతూంది

## 163. సుందర నిలయం

నీ చరణారుణ వలయం
నా చిర సుందర నిలయం
నీ చిత్ కూకుటి నిలయం
నా కను చీకటి వలయం

## 164. ప్రమాదం

మాటలు మరీ బాగా వస్తే
మతిపోయే ప్రమాదం ఉంది
అన్నిట్లో అర్థం లాగదీయజూస్తే
ఉన్నర్థం పోయే ప్రమాదం ఉంది

## 165. రాక్షసులులేని రామాయణం

సామాజిక స్పృహలేని సాహిత్యం
సంతాన ప్రాప్తి లేని దాంపత్యం
పదవి లేని ప్రజాసేవ-గమ్యం లేని నావ
రాజకీయంలేని రచనం
రాక్షసులు లేని రామాయణం
లంచంలేని ఉద్యోగం - పింఛం లేని మయూరం
మధ్య తరగతి జీవితం - గుణితం లేని గణితం

## 166. నాదేశం

సభల్లో సమావేశాల్లో
మాటలూ మాటలూ మాటలూ
సందుల్లో, గొందుల్లో - ఇంటా బయటా
మనుషులూ, మనుషులూ, మనుషులూ
మాటలకూ మనుషులకు మధ్య
మోసాలు, ద్వేషాలు, రోషాలు, ధ్వంసాలు
నా దేశం

## 167. తాగుడు తలలు

తాగుడుకు తలలెన్నో!-
వాగుడు వసపిట్ట - వాగ్దానాల పుట్ట
తీయని విషచషకం - తెగవాగకే సైతాన్
కంచెలేని తోట - కప్పులేని కొట్టు
బీటువారిన పొలాలు - గుడ్డలు లేని బిడ్డలు
వెరసి
వేయి పడగల వికటహాసం
మోడు బారిన 'మధు' మాసం!

## 168. ప్రశ్నించు!

పుస్తకాన్ని మోస్తున్నది
మస్తకం
అయితే, పుస్తకంలో రాసింది
అంగీకరించే ముందు, అనుసరించే ముందు
ఆలోచించు!
తల ఊపే ముందు తర్కించు
పఠించినదాన్ని ప్రశ్నించు!

## 169. ఎకనామిక్స్ సుందరి

వసంతాన్ని ఓ యూనిట్‌గా తీసుకున్నా
ప్రేయసీ!
నేను చేస్తున్న నీ అధరసుధా కన్‌సంప్షన్
లా ఆఫ్ డిమినిషింగ్ యుటిలిటీకే ఓ ఎక్సెప్షన్

## 170. అనుమానం

అనుమానాల చెట్ల మీద
అపార్థాలు గూళ్లు కడతాయి
ఆదరించే ఆకుల్ని బాకులనుకుంటాయి
మురిపించే కుసుమ హాసాలను
మోసాలనుకుంటాయి
రసపూరిత ఫలాలను
విషపూరితమనుకుంటాయి
పచ్చని వనంలో చిచ్చుపెట్టి
వసంతాన్ని తరిమేస్తాయి

## 171. అవర్ణనీయం

ఇప్పుడే దేశాన్ని వర్ణించటం
ఏ కవికీ సాధ్యం కాదు
ఈనాటి సమాజాన్ని విశ్లేషించటం
ఏ మేధావి తరం కాదు
కార్యకారణ సంబంధాలు కనుక్కోలేక
హేతువాదం నోరు మూసుకుంది
జాతి జాతకం చెప్పలేక జ్యోతిష్యం
తన భవిష్యత్తేమిటా అని ఆవులిస్తూంది
ఏ సూత్రాలకు కట్టుపడని
మన సాంఘిక ఆర్థిక వ్యవస్థ
పోయిందే దారిగా
చేరిందే గమ్యంగా సరిపెట్టుకుంటూంది

## 172. మార్పులు

మార్పులు ఎన్ని వస్తున్నా
ఈ దేశంలో మనిషి మారటం లేదు
మనిషి మనస్సు మారటం లేదు
రూపాలు తప్ప గుణాలు మారటం లేదు
వివరణలే తప్ప విశ్వాసాలు మారటంలేదు.
మారకుండా మార్పులుచేసే
మాయామయ నీతి మనది

## 173. బ్రిటీష్ మ్యూజియం

బ్రిటిష్ మ్యూజియం
చరిత్రను వడబోసి తీసిన సారం
రాలిపోయిన పద్మాలు తేలుతున్న కాసారం
మర్కు మహాశయుడు
మహాసామ్రాజ్యాలకు
చరమ గీతం వ్రాసిన
సంధ్యాచల శిఖరం

## 174. ఇంద్రజాలం

ఈ మట్టి బొమ్మ నోట
ఏ మాటలు పలికిస్తావో
ఈ దిష్టిబొమ్మ చేత
ఏ నాటకమాడిస్తావో!

## 175. స్వార్థం

దళిత వాదానికి స్త్రీ వాదానికి
శిథిలమౌతున్న సామ్యవాదానికి
అవకాశవాదం నేర్పిస్తున్నది
దురిత కళా కోవిద స్వార్థం
అస్తి నాస్తి వివాదగ్రస్త న్యాయాన్ని
శ్మశానం లో కూడా సాధించలేక పోతున్న
సమానత్వాన్ని పోషిస్తున్నది స్వార్థం

## 176. పంచాంగం

అంతరిక్షపు అ - తిథినై
ఆనంద పారా - వారంలో తేలి
నవజీవన - నక్షత్రంలా వెలుగుతూ
భావభౌతిక సత్య - యోగంతో
కులమత వర్గీ - కరణం కూలద్రోస్తూ
పరిణామ - పంచాంగం ప్రణుతి కెక్కుతున్న
భారత దేశానికి జయోస్తు!

## 177. పాలికేక

నీవు వసంతానివై వస్తావనే
ఇన్నాళ్లు
నా బ్రతుకు తోటను పెంచుకున్నాను
చిరునవ్వుల పువ్వులతో వచ్చేయి నెచ్చెలీ!
ఈ విరహ శిశిరంనుండి వెంటనే విడిపించు నన్ను

## 178. మీరాఖాన్

నీవులేని నదరు లాండు
తావిలేని పూల చెండు
నీవు రాని భరతావని
కోకిల లేని ఆమని
మీరాఖాన్ మేరీ జాన్
కనరావా! హే భగవాన్
అనిమిషులట్లే మనుషుల
ఆయుష్మంతులను చేయు
పరిశోధన కార్యార్థం సురలోకం చేరావా!
ఏనాటికైన మనం ఎక్కడైన కలిసేమా!

## 179. పంచబాణుడు

నరాలను ఉసికొలిపే నాదాల కోసం
అంగాలను పొంగించే ఆవేశం కోసం
చూపును గమత్తుచేసే మత్తుకోసం
పంచప్రాణాలు, పంచేంద్రియాలు
పంచబాణుని పంచలో చేరుతాయి
పగలుచే పరిహరించబడిన బ్రతుకులు
దిగులుతో రగిలిపోయే గుండెలు
రేయి కౌగిటిలో పరవశిస్తాయి
కాలం కడుపులో కలవరిస్తాయి

## 180. నడిరాత్రి

గడియారపు రెండు ముళ్లు ప్రేయసీ ప్రియుల వలె
పెనవేసుకపోయి ఒకటైన అందాల అర్ధరాత్రి
కొపెన్‌హేగన్‌లో నీటి కాలువ ఒడ్డుమీద
నీటుగా కూర్చున్న ఓ బోటితో
మనసు విప్పి మాట్లాడిన నాలుగు మాటలే
వినేవాళ్లు, మెచ్చుకొనే వాళ్లు ఉంటే
అపూర్వమైన అనుభూతి కావ్యంగా మలచవచ్చు

## 181. శృంగార చేతన

ఎక్కుపెట్టిన ధనువులా
ఎవ్వరో ఆమె
చంపుతున్నది వాడి చూపుల
శరములను విడిచి
కరము లేపిన కోటి వరములు
కురిసినట్లోను
ఉరము ఊపిన స్వర్గ ద్వారం
తెరచినట్లోను.

## 182. మిగిలినవెన్ని?

వాడినచో వాడు కొన్ని
వాడనిచో వాడు కొన్ని
వాడినా వాడకున్న
వాడిపోవు కొన్ని

## 183. మర్‌మేడ్

కోపెన్ హేగన్ ప్రక్కన
కూరుచున్న మర్‌మేడ్!
సాగర తీరం మీది
మూగ శిలా సుందరీ!
కథలకు కమ్మని కలలకు
కళలకు జీవం పోసెడి మూర్తీ
తరగకుండా, చెరగకుండా
వెలసిన సత్కీర్తి!

## 184. కులం

విజ్ఞానామృతం కోసం జరిపిన
అజ్ఞా తాంబుధి మధనంలో
ప్రమాదవశాత్తు వెలువడ్డ
అజ్ఞాన హాలాహలం కులం

## 185. ప్రేమించు!

ప్రేమించు ప్రియతమా నన్ను ప్రేమించు
నా పంచేంద్రియాలను
నీ ప్రణయామృతంలో ముంచు
నీ తన్మయత్వంలో కరిగించు
నా జీవితాన్ని ప్రేమకలశంగా అందిస్తున్నాను నీకు
ఆస్వాదించు ప్రియతమా! ఆస్వాదించు
కాలాన్ని నీ కన్నుల్లో మోడ్చి
అనంతాకాశం వైపు శిరస్సెత్తి ఆస్వాదించు

## 186. ప్రణయ నాదం

నీ బిగువు కౌగిలి ధనస్సులో
నన్ను బాణంలా సంధించు
రసానంద శిఖరాల పైకి ప్రయోగించు
స్పందించే నీ పెదవులతో నన్ను శంఖంలా పట్టి పూరించు
దిక్కులు పిక్కటిల్లే నాదంలా నన్ను మ్రోగించు

## 187. కాల మహిమ

నవగ్రహాలు - నక్షత్రాలు
లెక్కలేని బ్రహ్మాండాలు
బిక్కు బిక్కున తిరుగుతున్నాయి
కాలం గీసిన వృత్తాలలో
నింగి వ్రేలాడుతూంది
నిశ్శబ్దం వ్రేలాడుతూంది
చెట్టులాంటి కాలాన్ని పట్టుకొని
గుట్టు తెలియనిదేశాన్ని గుర్తుపెట్టుకొని

## 188. ఏది సత్యం

మనకు కనిపించేది సత్యం కాదని
మాయావాది వాదం
మరి మనకు కనిపించనిది
సత్యం ఎలా అవుతుందని
హేతువాది ప్రశ్న!

## 189. అవర్ణనీయం

ఇన్ని అభివర్ణించిన వాచస్పతిని నేను
నిన్ను వర్ణించలేక పోతున్నాను
ఎన్నెన్నో అనుభవించిన కళామతిని నేను
నిన్ను అభినయించలేక పోతున్నాను
శ్రీకార శిఖరాలమీద
ఓంకార శిఖరాల మీద
నా ఆత్మానుభూతిని ఎగరవేయడానికి
నీ సరళవక్ర రేఖాగణిత గుణిత జనిత
అగణిత రూపాలను
అవగాహన చేసుకుంటున్నాను

## 190. దిగంబరులు

నా ప్రస్థాన త్రయ పాండిత్యం
నీ గంభీరనతనాభిలోయలో కూలిపోయింది
నా సకల శాస్త్ర విజ్ఞాన సర్వస్వం
నీ శిరోజనీలి శిఖరాలముందు
తెల్లబోయింది
దిక్కుతెలియని దిగంబరులం మనం
చిక్కుకున్నాం
ద్వి శరీరాలింగనైక శ్రీ కారాకారాదిమ బంధంలో
ప్రాణ సఖీ!
నా ఆశాకాశ పూర్ణచంద్రముఖీ!

## 191. ఆమె నాట్యం

నాట్యం చేసింది ఆమె
నా హృదయ వేదిక మీద
నవరస రూపిణియై నవజీవన నాయికయై
అనంగ శరాలు వర్షించే ఆంగికాభినయంతో
సకలాంగరోమాంచక సాత్వికాభినయంతో
అభినవ సత్యభామలా కటాక్షించింది నన్ను
ఈ వెర్రి గోపాలుణ్ని వేణు గోపాలుణ్ని చేసింది

## 192. త్రికరణ శుద్ధి

ఆత్మలేని శరీరంలా
అనుభూతి లేని ఓ కవితా కలేబరం
కుళ్లి కంపు కొట్టింది
త్రికరణ శుద్ధిలేని బుద్ధి
చీకటి బజారులో అమ్ముడు పోయి
సత్య సాహిత్య సరస్వతిని
చిత్రహింసలు పెట్టింది

## 193. భారతం

గిరికాపతి ఉపరిచరుడు
కీకారణ్యంలో
సతిని తలచుకొని
రేతస్ఖలనమైన వేళ
కాల గర్భమున
భారతకథ పుట్టిన వేళ

## 194. ఉమ్మడి కార్యక్రమం

"సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ" అంటూ
స్వార్థం పరమార్థం బోధిస్తున్నది
"స్వార్థం శరణం గచ్ఛామి" అంటూ
పైశాచిక ధర్మం ప్రతిస్పందిస్తున్నది
ఎవరి స్వార్థం వారు చూచుకోవటం
ఈనాడు
అందరి కనీస ఉమ్మడి కార్యక్రమం

## 195. మర్మజ్ఞుడు

"ఏరంగంలోనైనా సబలనే
ఒక్క నీ పరిష్వంగంలో తప్ప"
అని నేనంటే
"అంతటి బలం నాకిచ్చింది
అబలవైన నీవే" అని పరిహాసమాడినపుడు
సిగ్గుతో ఎరుపెక్కిన నా బుగ్గలమీద
చుంబన శ్రీకారం చుట్టావు
మరిచిపోలేదు గదా! మహానుభావా
చేతల్లో సరే సరి
కనీసం మాటల్లో కూడా
నిన్ను ఓడించనీయని మర్మజ్ఞుడవు నీవు

## 196. యోగ మార్గం

కార్యదీక్షలో సత్యాన్ని దర్శిస్తే
కర్మయోగం
ఆలోచనా దర్పణంలో సత్యదర్శనం
జ్ఞానయోగం
ఆత్మార్పణంలో కలిగే సత్యానుభూతి
భక్తి యోగం
త్రియోగ ప్రయోగశాలలో
ఏకైక సత్యాన్ని సాధించే
తీరికలేని కోరికను నేను

## 197. భగవంతుని బాధ

"సంభవామి యుగే యుగే" అన్నవాడు
చాలించాడు అవతారాలెత్తడం
దుష్టు లెవరో శిష్టు లెవరో తెలియనీయని
ద్వైతాద్వైత మిధ్యా తత్వాన్ని
మాయామయ అయోమయత్వాన్ని
సృష్టిస్తున్న స్వార్థపరాసురత్వాన్ని
అంతమొందించాలంటే
ఏ రూపం దాల్చి రావాలో
ఏ ఆయుధం కావాలో
బోధపడక బాధ పడుతున్నాడు
భగవంతుడు

## 198. ప్రేమార్థి

నా ఆపాదమస్తకం ఓ పుస్తకంగా చదివేస్తున్నావు
కుసుమాస్త్ర విద్యా పరీక్షకు కూర్చోబోతున్నావా?
ప్రేమార్థీ!
నా హస్త రేఖా లేఖల్ని
కనులు మూసికొని చదివేస్తున్నావు
కటిక చీకటిలో కూడా
నీ తేనె పెదాల తెలుగు భాషలో

## 199. బూడిదలో గాడిద

గతాన్ని స్తుతిస్తూ
గాడిదవై పోకు
భవిష్యత్తుకు భయపడుతూ
బూడిదవై పోకు

## 200. వెర్రివాడు

నింగి గుండె మీద
మెరపు చరుపు పడ్డప్పుడు
వినిపించే రోదన ధ్వనులను
విప్లవ గర్జనలని భ్రమించేవాడు
వెర్రివాడు

## 201. ఎత్తుల గమ్మత్తులు

ఎత్తు మడిమల జోళ్లు - ఎత్తు నితంబాలు
ఎత్తు ఉరోజాలు - ఎత్తు శిరోజాలు
ఈ ఎత్తుల గమ్మత్తుల మత్తులో పడగానే
ఎత్తు కుసుమ ధనుస్సు మన్మధుడు
అప్పుడు రతులు మనమతులు హరిస్తారు
మనిషిని కాదు డబ్బును వరిస్తారు
విలాసాల వినోదాల విపణి వీధుల్లో
విలువలు వింతగా ఉంటాయి
తెలివిగా బేరమాడలేకపోతే
తెల్లమొహం ఖాళీ జేబు మిగులుతుంటాయి

## 202. జీవియస్ కోకిల

సాయి సుధార్చిత
శ్రీ రామాయణ పారాయణమున మత్తిల్లిన
జీవీయస్ కోకిల పాడెను
వేయి వసంతాల చరిత వినని పదమ్ముల్!

## 203. భావ చేతన

కాలాన్ని జయించిన భావాన్ని నేను
దేశాన్ని అధిగమించిన భాషను నేను
దేశ కాలాల లీలా వైభవాన్ని
దిన వెచ్చం చేసుకున్న
దిగ్దిగంత యాత్రికుణ్ణి నేను
మానవ జీవిత రహస్య మార్గాన్వేషిని నేను

## 204. ఆకలి సెక్సులు

ఆకలి లేకుంటే అభ్యుదయత్వం లేదు
సెక్సు లేకుంటే శృంగార తత్వం లేదు
ఆకలి సెక్సులు ఈ కలిలో
అత్యాచారాలు చేయకుంటే
అసురత్వాలు నేర్వకుంటే
బ్రతికిపోతుంది మానవత్వం
వెతుక్కుంటూ వస్తుంది దైవత్వం

## 205. పూల విలువ

పూల విలువ తెలిసిన పూర్ణస్త్రీ సత్యభామ
పరమాత్మను కాలదన్ని
పారిజాతాలను వరించింది
ఒక్క పూల మొక్క కోసం
ఇంద్రలోకాన్ని జయించింది

## 206. శక్తి శైలూషి

ఆనంద బ్రహ్మ
ప్రణయ లీలా పరిష్వంగంలో
అనంత రహస్య గర్భవతియైన
అప్రమేయ శక్తి శైలూషి
ఈ ప్రకృతి!
నిరంతర సత్య ప్రసూత ఆమె
నిత్య చైతన్య ఘోషవతి ఆమె

## 207. సూర్య గ్రహణం

ఎవరినీ నమ్మడానికి లేదు
ఇంద్రుడైనా సరే, చంద్రుడైనా సరే
తన కాంతి రక్తాన్ని ధారవోసి
ఘనత కెక్కించిన సూర్యుణ్ణే
గుట్టుగా వచ్చి పట్టపగలే
గుటుక్కున మింగేశాడు చంద్రుడు
చిత్రమేమిటంటే
సిగ్గుతో బుగ్గియైన సూర్యుడు
తన స్థితిని చూడవద్దన్నాడు
చూస్తే కళ్ళు పోతాయని క్షుద్రశాపం పెట్టాడు

## 208. వెలుగు చీకటి

వెలుతురు సృష్టిస్తుంది
చీకటి హరిస్తుంది
వెలుతురు శ్రమిస్తుంది - చీకటి భుజిస్తుంది
చీకటి, తన అధికార పత్రాల మీద
వెలుతురుతో ఆమోద సంతకాలు చేయిస్తుంది
తూర్పు పండించే కాంతిని నేర్పుగా కబళించి
పడమటింటిలో విలాసాల విందు చేసుకుంటుంది

## 209. దీపావళి

మత్తెక్కిన చీకట్ల వికటహాసంలా
మతాబాలు ప్రేలుతున్నాయి
దిక్కులేని పక్షుల్లా దీపాలు బెదురుతున్నాయి
విజయగర్వంతో ఊరేగే చీకటికి
గౌరవాభివందనం చేసే గార్డుల్లా ఉన్నాయి
బారులు దీరిన దీపాలు

## 210. మనిషి

చేసిన తప్పే చేస్తున్నాడు మనిషి
తన మృత్యువును తానే
అన్వేషిస్తున్నాడు మనిషి
విజయా లెన్ని పొందినా
అపజయం కలిగేదాక
విశ్రమించడు మనిషి

## 211. రంకు సూత్రం

మాటలకూ చేతలకూ మధ్య
మాయమర్మాలు ప్రవహిస్తున్నాము
ప్రజలకూ ప్రభుతకూ మధ్య
పైరవీలు జీవిస్తున్నాయి
భజన యుక్తికి పట్టం కట్టి
సృజన శక్తిని అడవిలోకి నెట్టి
"రాజ్యం రాక్షస భోజ్యం" అంటూ
రంకు సూత్రం వర్ధిల్లిస్తున్నాయి

## 212. తెలియనివాడు

ఈ మట్టి గోళాన్ని గిరగిరా త్రిప్పేది
ఎవరైనా
మనిషి మాత్రం కాదు
ఆ సూర్య గోళాన్ని భగభగమండించేది
ఎవరైనా, మనిషి మాత్రం కాదు
అంతం లేని కాలాన్ని సృష్టించేది
మనిషి మాత్రం కాదు
ఈ అద్భుతాల కర్త ఒకడున్నాడనుకుంటే
అది ఎవరైనా
మనకు తెలిసిన వాడు కానీ తెలిసే వాడు కానీ కాదు.

## 213. రసయోగం

వీణలేని వైణికుణ్ణి
రథము లేని సారధిని
మ్రోగిస్తాను మౌన భావ తంత్రుల్ని
నడిపిస్తాను దేహాత్మ తురంగాలను
వీణ కోసం చేయి చాస్తే
నా పాణియే వీణ అయింది
రథం కోసం పథం వెదికితే
నా చూపే రథం అయింది

## 214. ప్రమ-భ్రమ

ప్రేమ వెలిగిస్తుంది ప్రమ
ద్వేషం కలిగిస్తుంది భ్రమ
అందుకే ద్వేషాన్నైనా ప్రేమిస్తానే కాని
ప్రేమను ద్వేషించలేని
పిచ్చివాణ్ణి నేను - బుజ్జి గాణ్ణి నేను

## 215. లక్ష్మీ సరస్వతులు

లక్ష్మితో సరస్వతిని
కొలుస్తారు కొందరు
సరస్వతితో లక్ష్మిని
కొలుస్తారు మరి కొందరు
లక్ష్మీ సరస్వతులు కలహిస్తే ఉభయ మారకం
కలిసి వస్తే ఉభయతారకం

## 216. సామగానం

యౌవనం వృద్ధాప్యాన్ని ఎదిరిస్తుంది
ముదిమి బెదరకుండా
వయసు వాకిట్లో చొచ్చుక వస్తూనే ఉంటుంది
విగ్ర వీగే మనిషి దేహదుర్గాన్ని
వింత వింతగా ఆక్రమిస్తూనే ఉంటుంది
కామ గానం వినిపించే
గండు తుమ్మెదల్లాంటి తల నీలాలను
సామగానం వినిపించే
వెండి తీగల వీణగా మారుస్తూనే ఉంటుంది

## 217. కందుకూరి

సాయుధ విప్లవాలతో సాధించలేని
సంఘ సంస్కరణలను
సాహితీ సౌరభాలతో
సాధించిన కీర్తి శృంగం
కందుకూరి వీరేశలింగం
గోదావరి సరిత్తులా గుండెను పొంగించాడు
ఆదర్శాల, ఆచరణల తీరాలు
ఆవరించి ప్రవహించాడు

## 218. సాదృశ్యం

చంద్రునికీ నాకూ చెప్పలేనన్ని పోలికలు
చీకట్లను చీదరించుకొనే చిత్తవృత్తి మాది
పరావృత్తిని కాంక్షించే ప్రవృత్తి మాది
ఆకాశయానం అంటే
అలసట లేని ఆవేశం మా ఇద్దరిది
ఇద్దరమూ
స్వచ్ఛంద జీవన తటాకంలో
ఆత్మ దర్శనం చేసుకుంటాం
ఇద్దరం సరస సాగరులమే
సాగర హృదయ స్పందనలమే
ఇద్దరమూ తారా ప్రియులమే
ఇద్దరమూ కల్హార కాంతులమే

## 219. అల్లరి అలలు

నీటిలో పుట్టి నేలగట్టుకు చేరుతూ
నేలను ముట్టి నీరధిలోకి జారుతూ
ఆడుకొనే ఆటపేరే జీవితమా!
పాడుకొనే పాట పేరే పరమార్థమా!
కడలి లోతులు చేరుకోలేని తరగలు
అటూ ఇటూ ఊగడమేనా
ఎటూ కాని దేశకాల దిమ్మరులేనా

## 220. బాబా భావోత్పలం

శ్రీకరమై సమస్త మత సేవితమై
పరమాత్మ తత్వ బోధాకృతియై
చారాచర దృశ్యాదృశ్య సృష్టిరహస్య వేదియై
లోకవిలోకన ప్రణవలోచనమై
ప్రభవించె సాయిబాబా
కరుణా రసార్ణవ శివంకర సుందర సత్యశాయియై

## 221. విలపించే కాలం

కాలానికి దారిచూపే
కవిత కళ్లు కప్పేశారు
జీవితానికి అర్థం చెప్పే
కలం గొంతు నొక్కేశారు
దారిలేని ఎడారిలో కాలం విలపిస్తోంది
అర్థంలేని భాషలా బ్రతుకు ఆవులిస్తోంది

## 222. బాల్యాన్వేషణ

చితికిపోతున్న జీవితంలో
బ్రతికి పోయిన బాల్యం కోసం వెతుకుతున్నాను
అమ్మరూపం కనిపిస్తే చాలు
అర్భకుణ్ణై పోతున్నాను
అమ్మ గొంతు వినిపిస్తే చాలు
ఆనంద వర్ధనుణ్ణై పోతున్నాను
మాతృభావత్వారాధనలో
మళ్లీ మళ్లీ జన్మిస్తున్నాను
బాల్య జీవితానుభూతిలో
మృత్యువును జయిస్తున్నాను

## 223. ద్వైతం

జననం ఒక పుట - మరణం ఒక పుట
మానవ జీవిత పత్రాలకు
దినం ఒకపుట - రాత్రి ఒకపుట
రాలిపోయే కాలవట పత్రాలకు
దేశం ఒకపుట - కాలం ఒకపుట
అనంత సృష్టితాళ పత్రానికి
ఒకే పుటగల పత్రం లేదు
ఒకే తీరం గల నది లేదు
సకలం ఆమ్రేడితం

## 224. స్త్రీవేదం

నేడు కావలసింది
అంగనను అబలగా చిత్రించే స్త్రీవాదం కాదు
సబలగా గుర్తించే స్త్రీవేదం
స్త్రీకి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లేవని
విలపించేది స్త్రీ వాదం
ఉన్నా ఉపయోగించుకోనీయని
పన్నాగాలను ప్రశ్నించేది స్త్రీవేదం
లైంగిక వివక్ష వ్యూహంలో చిక్కిన
సాంఘిక వ్యవస్థ విముక్తి
స్త్రీవేదం

## 225. రాగధునులు

రమ్మన్నా వద్దన్నా వచ్చేది
వసంతం
పాడమన్నా వద్దన్నా పాడేది కళకంఠం
చెట్టు కనిపిస్తే చాలు చివురించే చేతనాలు అవి
గాలి ఈలవేస్తే చాలు నర్తించే కేతనాలు అవి
కవితల దుస్తులు ధరించి
ఉగాది పచ్చడి భుజించి
ప్రజలూ పాలకులూ మెచ్చే పంచాంగాలు పఠించే
త్యాగధనులు - రాగధునులు అవి

## 226. మహానగరం

మనిషిమీద విశ్వాసం పోయి మతిచెడిన కుక్కలు
దొంగభక్తుల గోల పడలేక
గుళ్ళల్లోనుంచి పారిపోయిన దేవుళ్లను
బజార్లలో వెదుక్కునే పశువులు
చీకటి బడిలో
సగటు మనిషి రక్తనాళ తంత్రుల మీద
సంగీతం నేర్చుకుంటున్న దోమలు
ఇల్లలకకుండానే పండుగ చేసుకొనే ఈగలు
ఏమంటున్నాయో తెలుసా
మాకంటే ఏ కవి వర్ణించగలడు
ఈ మహానగర సౌందర్యాన్ని అని

## 227. పక్షాల యుగం

ఇది పక్షాల యుగం
పాలక పక్షం - ప్రతి పక్షం
మిత్ర పక్షం - శత్రు పక్షం
వామ పక్షం - దక్షిణ పక్షం
సమైక్య పక్షం - తటస్థ పక్షం
ఏ పక్షంలో ఎవరున్నారో
ఏ పక్షి ఏ పక్షం నుంచి ఏ పక్షానికి
ఎప్పుడు ఎందుకు ఎగిరిపోతుందో
చెప్పడానికి కావాలిప్పుడు మరొక పక్షం
ప్రత్యేక పిరాయింపుల ప్రమాద సూచక పక్షం

## 228. తెలిసికో

మట్టి లేనిది చెట్టు లేదు
చెట్టు మాత్రం మట్టి కాదు
మట్టికీ చెట్టుకూ మధ్య జీవ బంధం తెలిసికో
నింగి లేక నేల లేదు
నేల మాత్రం నింగి కాదు
నింగి నేలల కలిపి నిలిచే నిచ్చెనేదో తెలిసికో
పూవులేక తావి లేదు
తావి మాత్రం పూవు కాదు
పూవు తావులు కూడి పాడే భావమేదో తెలిసికో
జననముంటే మరణమున్నది
మరణముంటే జననమున్నది
జనన మరణము లేని దేగతి జన్మమొందెనో తెలిసికో!

## 229. జాక్‌పాట్

దేశమనే మైదానంలో
కాలమనే గుర్రాలు
పెట్టే పరుగును కనిపెట్టే శక్తి
పట్టుపడింది నాకు
అందుకే
ఏ పాటు లేదు నాకు జాక్‌పాట్ తప్ప
ఏ గుర్రం గెలవలేదు నా గుర్రం తప్ప

## 230. ఆత్మజ్ఞానం

ఆత్మను పరమాత్మను విడదీసేది
దేహం
ఆత్మను శరీరాన్ని విడదీసేది
అహం
ద్వైతాన్ని అద్వైతం చేసేది
సోహం

## 231. నెదరు లాండు

ఆలమందలు పూలతోటలు
అచ్చరల తలదన్ను బోటులు
స్నేహశీలం వెలుగుచుండు
నేల తీయని నెదరులాండు

## 232. ఏడ్స్

ప్రకృతి విరుద్ధమైన లైంగిక ప్రవర్తనంలో
విషయ సుఖం విషమవుతుంది
అధరామృత చుంబనం మృతి చుంబన మవుతుంది
ప్రాణం పోసే రక్త బిందువులే
ప్రాణం తీసే సూక్ష్మక్రిము లౌతాయి
ప్రకృతి ధర్మాన్ని ధిక్కరించి
కొందరు తమ పాప పంకిల జీవితాల్లోకి
దుష్టనికృష్ట "ఏడ్స్" నామ మాయావిని
ఆహ్వానించి ఆశ్రయం ఇస్తున్నారు
దానిభీకర క్షుధాగ్నికి వారుకూడా బలైపోతున్నారు

## 233. శ్మశాన వాటిక

శవాలు లేస్తున్నాయి
సవాలు చేస్తున్నాయి
తమ ప్రాణాలను హరించిన
తమోగర్భాలను చీలుస్తామని
పరమ శివుడు ఎవరో ఈ శ్మశాన వాటికలో
నవజీవన నాట్యం చేస్తున్నాడు
నందనందను డెవడో ఈ కంకాళ శల్య శలాకలతో
వేణుగానం చేస్తున్నాడు
చితికిన హృదయాలే శంఖాలై ఫీంకరిస్తున్నవి
ఆరిన ఆశారేఖలే అనలఅనిల కీలలై హుంకరిస్తున్నవి

## 234. చుక్కప్రవచనం

ప్రాణేశా!
ఈ ప్రకృతి నిన్ను గేలిచేస్తున్నది
నీ ప్రకృతి ధర్మం మరచి పోయావా అని
పరిహాసమాడుతున్నది
సందేహంలో పడ్డవాడు సరసమాడలేడని
సాహసంలేని వానికి సంతోషం లేదని
కొండలోయల గుండె గండుకోయిలై కూస్తున్నది
అవకాశం దొరికినపుడు ఆకాశం కేసి చూసేవారికి
దక్కేది శూన్యమేనని
నీ ప్రక్కనున్న చుక్క ప్రవచిస్తున్నది

## 235. మూసీ కళ్లు మూసింది

మూసీనది గొంతుతడి ఆరింది
భాగ్యాల ఏటి బ్రతుకు మారింది
వలపు పాటలు పాడిన చోట
మురికి పాటలు పాడుతూంది
కలలుకూడా కనలేని కళ్లు మూసుకుంది.
గోలకొండ నెమరు వేస్తుంది మూసీ గతవైభవం
మూసుకున్న ముక్కులు వర్ణిస్తున్నాయి
మూసీ నేటి సౌరభం

## 236. చిరంజీవి

శాశ్వతమైంది ఏదైనా ఉంటే
సర్వాంతర్యామికి అర్థం ఉంటే
అది వేదోపనిషత్తులు వల్లించే
పరబ్రహ్మ తత్వం కాదట
నిత్య సత్యమైన
స్వార్థ పరత్వం మాత్రమేనట

## 237. నాయకులు

అడిగానా అన్నం పెట్టదనే
అపోహలో పడిపోయి అడవి దారి పడుతున్నారు
అమాయకులు
పదవిని మించిన పరమార్థం లేదని
నాయకులు శంకలేని సేవ చేస్తూనే ఉన్నారు

## 238. రాజయోగం

అబూ శైల శిఖరాలమీద
ఆత్మజ్ఞానం ఉదయిస్తూంది
మనిషిలోని ఇంద్రియాల
మాయచీకటి నిష్క్రమిస్తూంది
జీవాత్మకు పరమాత్మకు
రాజయోగం కుదురుతూంది
భూలోకాన్ని మళ్లీ
సత్యయుగం దర్శించే
సన్నాహం జరుగుతూంది.

## 239. ఉపాయం

అందరూ ఈతగాళ్ళే
నీటిలోతు అనుకూలిస్తే
అందరూ ఆటగాళ్లే
పోటీగాళ్లు సహకరిస్తే

## 240. మృత్యువు

మృత్యు రోగానికి
పక్కామందు కనిపెడితే
చావటం గడ్డుసమస్య కావచ్చు
మరుపు అనే గుణం వదిలేస్తే
మనిషి
చిరస్మృతుల చితిగా మిగలొచ్చు.

## 241. వేటింగ్

వీటినుంచి శ్మశానవాటికి
వెళ్ళి వస్తున్నాను ప్రతిరోజూ
తూర్పు పడమరల మధ్య
తూగాడే దారిలో
కాటిలో చోటుకోసం కూడా
'వేటు' చేయాలంటూంది కాలం

## 242. మంత్రగత్తె

మగువ వెన్నుపూసకు
ఏదో మంత్రశక్తి ఉంది
ఒళ్లు ఊపిందో లేదో
నా గుండె ఝల్లుమంది-

## 243. గమ్యం

దొరకనిది వెతకటం దోషం కాదు
తీరనిది కోరటం నేరంకాదు
వెతుకుటయే దొరకటం
కోరుటయే తీరటం
అని తెలుసుకుంటే జీవితం

## 244. శలభాలు

అనుభవాలు జ్ఞాపకాలు
మరపులో కాలిపోయే
శలభాలు
నేలపై రాలిపోయే కుసుమాలు

## 245. భయం భయం

బ్రతుకంటే భయం
చావంటే భయం
అన్నిటికీ అందరికీ భయంభయం
భయం లేనివాడు భగవంతు డనుకుంటాను
అయినా అతనికి భయపడుతూనే ఉంటాను.

## 246. అద్దం

ఆత్మను చూపించే అద్దం కోసం
అంగళ్ళన్నీ తిరిగాను
దారిలో తారసిల్లిన అనుభవజ్ఞు డన్నాడు
అద్దం చూపేది అబద్ధం
కళ్లు మూసుకుంటే కనుపడేది సత్యం అని.

## 247. మారని మనిషి

రామాయణం చదివి
రాక్షసు లౌతున్నారు
హరిశ్చంద్రనాటకం చూచి
అబద్ధాలు నేర్చుకుంటున్నారు
ఏమిటి చేసేది?

## 248. జడభరతులు

ఎలుకలు దూరాయని
ఇల్లును తగలేశారు
ఈగలు మూగాయని
ముక్కును తరిగేశారు
జడభరతులు - త్యాగనిరతులు

## 249. రహస్యాలు

చెట్ల చెవుల్లో పక్షులు
చీకట్ల రహస్యాలు చెపుతున్నాయి
అర్థమైనట్లు అవి
తలలూపుతున్నాయి.

## 250. పిరమిడులు

నైలునది ఒడ్డుమీద నాగరికత కట్టుకున్న
గుడులు - పిరమిడులు
కష్టాల ఎడారిలో కాలం పాఠాలు నేర్పే
బడులు - పిరమిడులు
ఆకాశ ఫలకం మీద కవిత వ్రాయటానికి
భూకాంత పట్టుకున్న వజ్రగంటాల
పిడులు - పిరమిడులు

## 251. ప్రకృతి ధర్మం

కొరడాల విసరితే
కోకిలమ్మ పాడునా?
కొమ్మలు విరబూయునా!
నిప్పులు కురిపిస్తే నెమిలి
పురివిప్పి ఆడునా?

## 252. అడవి మహిమ

ఆదిమానవుడు పుట్టిందీ
వేదమానవుడు పుట్టిందీ
అడవిలోనే
చెట్లూ మనిషీ కలిస్తేనే
చివురిస్తుందేమో విప్లవం!

## 253. దురాశ

దురాశా పరునికి
మిగిలేది నిరాశ
పరాన్న భుక్కుకు దక్కేది
పరాభవం

## 254. నిష్ఫలం

ఒక దేవుణ్ణి చంపి
మరొక దేవుణ్ణి బ్రతికించలేం
ఒక సూర్యుణ్ణి కాదని
మరొక సూర్యుణ్ణి దర్శించలేం

## 255. నిక్ నేమ్

అమెరికాలో
క్రిష్ణను క్రిస్ అని
యశ్వంత్‌ను యస్ అని చనువుగా పిలుస్తారట
"ఆస్తిక్" అని పేరు పెడితె
Ass అంటారేమోనని భయపడిందో తెలుగు తల్లి.

## 256. మాకందాలు

కొమ్మలు ఒలకబోసే కోకిలల గానసుధ
మత్తుగా తాగిన మామిడికాయలు
మధువుతో పొంగులెత్తాయి మండుటెండల్లో కూడా

## 257. వెన్నెల

చకచకలాడే చుక్కలు
జాబిల్లిని కాగితపు పడవ చేసి
నింగి సరసిలో ఆడుకోవటం చూసి
పకపక నవ్విన చీకటి పండించింది వెన్నెల

## 258. కాంస్య విగ్రహం

పిట్టల రెట్ట వేతలకు
గిట్టనివాళ్ల తిట్టి పోతలకు
కలతచెందని నిగ్రహం కాంస్య విగ్రహం

## 259. సెలయేళ్లు

సెలయేళ్లు
కొండల గుండెల దాహం తీర్చే
ప్రపాకన్యలు
గట్లుమీది చెట్లకు గానం నేర్పే
కిన్నెర కన్నెలు

## 260. త్యాగానందం

తనయుడుగా ఇచ్చాను తలిదండ్రులకు
తండ్రిగి ఇచ్చాను తనయులకు
అర్పించటం తప్ప ఆర్జించటం తెలియని
నా జీవితం
ఇలాగే ముగియాలని నా మనోగతం

## 261. మువ్వన్నెల తెలుగుపాట

అమెరికాలో ఆట - ఐరోపాలో ఊట
తానాతో కలిసి నేడు - మువ్వన్నెల బావుటా!
అవి కలసి పాడే తెలుగు వసంతాల పాటలో
అవి కదం త్రొక్కే తెలుగు సంస్కృతి బాటలో
భారతీయ చేతన పరిమళిస్తోంది
మానవతాత్మ పరవశిస్తోంది
పశ్చిమాశా వాటిలో - కొత్త విలువల కోటలో

# బాపురెడ్డి కొన్ని ముఖ్య రచనలు

బాపురెడ్డి పద్య కావ్యాలు

బాపురెడ్డి గేయ నాటికలు

అనంత సత్యాలు

మన చేతుల్లోనే ఉంది

ప్రణవ ప్రణయం

పంచబాణ సంచా

రంగురంగుల చీకట్లు

వాడిపోని వసంతాలు

కాలం మాయాజాలం

నాదేశం నవ్వుతూంది

శ్రీకార శిఖరం

ప్రేమారామం

బాపురెడ్డి భావగీతాలు

మనసులోని మాట

**In Quest of Harmony**

**Longing for Life**

**Urn of Love**

**Loving is Living**